శ్రీ సీతారామం.

# నానార్థగాంభీర్యచమత్కారిక

——‡)(౦ ౨ ౦)(‡——

అనునీగ్రంథము

తెనుగుపద్యములు, సంస్కృతశ్లోకములు, హిందుస్థాని - తెనుగు - సంస్కృతము కలి
సియున్న చమత్కారపద్యములు, చదరంగపుయెత్తులు,

మొదలగునవి జేర్చి

కుచ్చర్లపాటి సూర్యనారాయణరాజుగారిచే

గోదావరిజిల్లా యిలాకా తుని పట్టణంబున

వెలసియున్న

శ్రీ రాజా వత్సవాయ వెంకటసింహాద్రిజగపతిరాజు బహదరుగారి

స్వకీయ

శ్రీసీతారామనిలయముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడెను.



డి ౨౦ అగస్టు ౧౮౯౨ సం॥రపు

గువాఁడు। తనపట్టిమొకిరింతదినువానిదినువాని కొడుకుతమ్మునకుదూపినవా
డు। తనవింటికొప్పునసును వారిదొర తేజి నెలవు పెన్నెరులుగా నెగడువా
డు। తన తేరుసవతి చక్రి నియింటిచుట్టంబు పగతుదాసుతియింప బరగువా
డు। నట్టి భ్రిమకేశుఁడవ్యయుం డమారసుతుఁడు। కామితములిచ్చి బ్రోచుత
కరుణతోడ॥

చ॥ ఇలరుహవైరివైరి ధరియించిన మేఘుని సామిపుత్రుతో। బలసుతి
చన్నవానిపురి భస్మము చేసినయుగ్రవైరితో। బలసుత తుల్యుఁడౌ నతని భర్త
కుమారుని వైరిశేఖరో।జ్జ్వల శశిపుత్రు తాత తనుజాత యొసంగుత సర్వ
సంపదల్॥

వృక్షములు- అగ్ని- ఉదకము- మేఘుడు- ఇంద్రుడు- వాలి- రావణాసురుడు- లంక-
ఆంజనేయులు- భీముడు- కృష్ణమూర్తి- మన్మథుడు- ఈశ్వరుడు- బుధుడు- సముద్రుడు-
లక్ష్మీదేవి.

క॥ సురవరుగురుప్రియసతిసుతు। వరసనుని తండ్రిమామతు వరసుతు
మామన్। శిరమందుగొన్న వరుసుతు। నిరతము సేవించు నియమనిష్ఠలు
సమతిన్॥

దేవేంద్రుడు- బృహస్పతి- తార- బుధుడు- చంద్రుడు- సముద్రుడు- లక్ష్మీదేవి- మన్మథుడు
సాంబమూర్తి- విఘ్నేశ్వరుడు.

క॥ నీరజమిత్రుని సుతుసుతు। కూరిమిసతి తనునితండ్రి కొమరునియ
న్నన్। ధీరతననిబరిమార్చిన। సూరునిసుతుమామ సకలశుభములసొస
గున్॥

సూర్యుడు- యమధర్మరాజు- ధర్మరాజు- ద్రౌపతీదేవి- అర్జునుడు- ధృతరాష్ట్రుడు- దు
శ్శాసనుడు- దుర్యోధనుడు- భీముడు- అభిమన్యుడు- కృష్ణమూర్తి.

గీ॥ పర్వతశ్రేష్ఠపుత్రిక పతివిరోధి। యన్నపెళ్లాము నత్తనుగన్నతం
డ్రి। ప్రేమతోడుత నాతని పెద్దబిడ్డ। సున్నమిప్పుడు తేగదే సన్నుతాంగి॥

పార్వతీదేవి - సాంబమూర్తి - మన్మథుడు - బ్రహ్మదేవుడు - సరస్వతీదేవి - లక్ష్మీదేవి - సము
ద్రుడు - జ్యేష్ఠాదేవి

క॥ శతపత్రంబుల మిత్రుని । సుతుజంపినవాని బావసూనుని మామన్ ।
సతతముతలఁపరియుండిన । సుతవాహనవైరివైరి సున్నంబిడుగా॥

సూర్యుడు - కర్ణుడు - అర్జునుడు - కృష్ణమూర్తి - మన్మథుడు - చంద్రుడు - సాంబమూర్తి -
విఘ్నేశ్వరుడు - ఎలుక - పిల్లి - కుక్క -

గీ॥ శతకపత్రమిత్రు సుతవరుజంపిన । సతని బావ పెద్ద యగ్రజుండు ।
సతని యాయుధంబు సవనమొందిన । సతడె యితడసుమ్ము యంబుజాక్షి॥

సూర్యుడు - కర్ణుడు - అర్జునుడు - కృష్ణమూర్తి - బలరామస్వామి - నాగలి - దున్నపోతు

క॥ నగపగతుపగతుపగతుని । పగతుండగు నగధరాజు బరమార్థ్హన
యా । జగజెట్టి యన్నతండిదె । పగు వాహనమైనయట్టి ధన్యుండితడే॥

దేవేంద్రుడు - నరకాసురుడు - కృష్ణమూర్తి - జరాసంధుడు - భీముడు - ధర్మరాజు - య
మధర్మరాజు - దున్నపోతు.

ఉ॥ విరహులవైరివైరి సఖి వేడుకసూనుని జేతుబంటుజో । డరుముగగో
న్నవాని సుతునాలిసహోదరిభర్తయనుజసం । బెనిమిటిసూనుమామ
వరపుత్రిక మామవిరోధితండ్రిసు । స్థిరముగవచ్చునంచు సముదారగుణా
కరసుంటెనిచ్చుటన్॥

మన్మథుడు - సాంబమూర్తి - గంగ - భీష్ములవారు - దుర్యోధనుడు - కర్ణుడు - దేవేంద్రుడు -
అర్జునుడు - చిత్రాంగిద - సుభద్ర - కృష్ణమూర్తి - జాంబవతీదేవి - సహదేవుడు - అభిమన్యు
డు - విరాటరాజు - ఉత్తర - సింహబలుడు - భీముడు - వాయువు.

చ॥ అసురులు మేఘముల్ కుసుమమాస్యము హేమము భాస్కరుండు
మా । సముసురగంబు శంకరునిచాపముపంకముపాండవాగ్రజుం । డమృత
కరుండనంబరగును క్రమ్మఱదసంజ్ఞల ముఖ్యవర్ణముల్ । క్రమముగ నాహ్వ
యంబొనరగన్గిన వేలుపు మిమ్ముబ్రోవుతన్॥

చ॥ మమతనుతానునొక్క చెలి మానినినీవిభునామ మేమనన్ । కమ

సీ॥ మాధవినీవునామగని పేరడిగేవు చెప్పవచ్చునటమ్మ సిగ్గువదలి। మా
ధవినీవునా మగని పేరడిగేవు చెప్పవచ్చునటమ్మ సిగ్గువదలి। మాధవినీవునా
మగని పేరడిగేవు చెప్పవచ్చునటమ్మ సిగ్గువదలి। చెప్పకతీరదా శేషశయనుని
పేరు చెప్పెదవినవమ్మ సిగ్గువదిలి। సిరియావృక్షంబు రారాజుసాధురగ్ని। ర
మార రజితాద్రి కేకియు నావతుదను। రెండుమూడేసివర్ణంబులమర మధ్య।
మధ్యమాక్షరపఙ్క్తి నా మగని పేరు॥

గీ॥ సిరియు వృక్షంబు ధనపతి పరిమేళంబు। ననలుడసురయానుపవనం
బసింహునావ। నంమమూడేసివర్ణంబులమరుశబ్దా। మధ్యమాక్షరపఙ్క్తి నా
మగని పేరు॥

దీని అర్థము.— వీరభోగవసంతరాయుడు కావలెను.

సీ॥ ఆద్యంతమధ్యమాంతాదిమధ్యంబులో తేటిరకారసిరాజు దెలియ
దల్లి। యాద్యంత మధ్యమాంతాదిమధ్యంబులో శివునిల్లువరి చేను క్షీరధార।
యాద్యంతమధ్యమాంతాదిమధ్యంబులో భార్యయు శిద్ధంబుబరగ చెట్టు।
యాద్యంతమధ్యమాంతాది మధ్యంబులో మారువన్నెయునీ కెమంటజో
డు। నన్నిటికి జూడ మూడేసి యక్షరములు। మొదలు తుదలను నడితుద
మొదలు నడుమ। ప్రాణరక్షణ లతలంమ పాదపములు। పరికరములంమనీ
యర్థమరయవలయు॥

అంజలి - గుమ్మడి - ఆవాలు - పొగడ.

సీ॥ అసమాన కోదండ సైన్యరాజెవ్వడు రాజు పేరిటగల రత్న మేది।
రత్నంబు పేరిట రంజిల్లుఋతు వేది ఋతువు పేరిటగల రుద్రుడేడి। రుద్రుని
పేరిట రూఢిల్లుజగమేది జగము పేరిటగల జంతు వేది। జంతువ పేరిటజన్మిం
చుపక్షేదిపక్షి పేరిటగలవృక్షమేది। యన్నిటికిజూడమూడేసియక్షరములు।
నామములుపంక మదలెల్లనామలగును। జెప్పనాతడుభావజ్ఞచక్రవర్తి। చె
ప్ప లేకున్ననగుమ నేచిన్నినగవు॥

శ్రీరామ - మగువ - వసంత - శాంకిని - క్షీరము - యేనుగు - గోరింక - కదంబ.

సీ॥ శ్రీరామునకు సీత చెలగియెచ్చటనుండు నారాము డేటికి నడవికేగె। నేగినమారీచు డేదిదాల్చుచువచ్చె నెసగి దైత్యుని రాము డెచటజంపె। సుగ్రీవుడా రాముజూచి యేమనిపల్కె వాలి రామునిచేత నేలజచ్చె। లంక నేరీతిని బొంకమడంచెను బ్రజల నేటికి తండు బ్రబలజేసె। నన్నిటికి జూడ మూడేసి యక్షరంబు। లీవలావల జూడంగ నేకవిధము। సమ్మతిగ జెప్ప భావజ్ఞచక్రవర్తి। చెప్ప లేకున్న నగుమనే చిన్ననగవు॥

సీ॥ రాము డెవ్వారితో రావణుసద్దించె పరవాసుదేవుపట్టణ మదేది। రాజమన్నారుచే రంజిల్లు శరమేది వెలయ కానుకపంటి విత్తదేది। యలరంభకొప్పులో నలరుపూదండేది సభవారి నవ్వించు జాణ డెవడు। సీత పెండ్లికోరి చేసిన ధనువేది శ్రీకృష్ణు డెచ్చోట జెలగుచుండు। నన్నిటికిజూడ నైదేసి యక్షరంబు। లీవలావల జూడంగ నేకవిధము। సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి। చెప్ప లేకున్న నగుమనే చిన్ననగవు॥

తోకమూకతో- రంగనగరం- లకోరకోల- జంబీరబీజం- మందారదామం- వికటకివి- పంచాస్యచాపం- నందసదనం.

సీ॥ రాజులకెటువంటి రత్నముల్ప్రియమయ్యె కాయలేచెట్లవికరులు మింగు। నీశ్వరుం డెవ్వాని నెచ్చోట ధరియించె జారు డేవేళ నెవ్వానిగోరు। నెన్నెన్ని దినములకే తెంచు పున్నమి జనయిత్రి పుత్రి నేజాడ మోసె। బంధువులెవ్వ్యోడబలసియే తెంతురు యీతకాడెంమన భీతిజెంద। నన్నిటికిజూడ నైదేసి యక్షరంబు। లీవలావల జూడంగ నేకవిధము। సమ్మతిగ జెప్ప భావజ్ఞ చక్రవర్తి। చెప్ప లేకున్న నగుమనే చిన్ననగవు॥

వెలగలవె- నెలతలనె- నెలనెలనె- కెలకులకె.

సీ॥ మనుజునియాకారమహిమకు మొదలేది నగవైరివైరికినగర మేది। రాముడు గాచిన రాక్షసపక్షేది శిఖికర్ణమూరించు చెల్వమేది। పంచబాణునిపింటబరగినరువియేది గిరిజాపతిభుజించు గిన్నెయేది। నయనాంగిరి

ఘనులనలువొందు చెలు వేది చెలగిమాసముగాచు చెట్టేది। యన్నిటికిజూడ రెం డేసియక్షరములు। యామలుడుపంగతుద లెల్లనామలగును। సమ్మతిగ జెప్ప భావజ్ఞచక్రవర్తి। చెప్పలేకున్ననగుదు నేవిన్ననగవు॥

తల - లంక - కాకి. కత్తి - తీవు - పురెలి - రెప్ప - పత్తి.

సీ॥ నక్షత్రవీథికి నాథుండు యెవ్వాడు రంగైన గుడిలోన లింగమేది। నాహారంబులమీద పన్నెకు పేరేది దేవతామునులకు తిండియేది। నరకాసురునిగన్న నాతినామంబేది పాలతిచక్కదనంబు బోల్పనేది। తల్లికికడబుట్టు గనయుని పేరేమి బింబంబుగప్పెడి పేరదేది। యన్నిటికిజూడ రెండేసి యక్షరములు। యామలుడుపంగ తుదలెల్ల నామలగును। సమ్మతిగ జెప్ప భావజ్ఞచక్రవర్తి। చెప్పలేకున్న నగుదు నే విన్ననగవు॥

శశి- శిల- లక్ష్మి- కంద- ధర- రంభ- భ్రమ- మబ్బు

సీ॥ జనులకు కవచంబు సమరమం దెయ్యది గుహునకు ప్రియమైన గుర్తు మేది। గుర్తునబరగెడి గురువాక్యమెయ్యది శిశువుల వృద్ధికి బోసగునేది। యామోదమునియెడి నామమేమందురు యునికిపట్టనియెడి యుడుపదేది। రాజుల రాజుల రక్ష్యం బదెయ్యది మండువేసవిగాయు మహిజమేది। చెలగు రెండేసిపదముల కెలమిజూడ। నుత్తరంబేకవచనమై యుండవలయు। సమ్మతిగజెప్ప భావజ్ఞచక్రవర్తి। చెప్పలేకున్న నగుదు నే విన్ననగవు॥

సీ॥ దశరథాగ్రసుతుండుశశియనుబట్టణం బొక పేరులోపల నుండవలయు। దిగ్పకాంతకుడు నేత్రంబును మాలయు నొక పేరులోపలనుండవలయు। వేల్పుసుత్రోవయు వెలయుబ్రసూనంబు నొక పేరులోపలనుండవలయు। కనకంబు కార్పాసమొనరమహీజంబు నొక పేరులోపల నుండవలయు। దినియర్థము దెలియగబూనుకొనుచు। మదివిచారించిపమనైనమాసములను। సమ్మతిగ జెప్ప భావజ్ఞచక్రవర్తి। చెప్పలేకున్న నగుదు నే విన్న

నగవు॥

రామచంద్రపురము - రుద్రాక్షమాల - దేవదారిపుష్పము - పైదిపత్తిచెట్టు.

సీ॥ ఏనుగుసింహంబు నెలనాగయునుగూడి యొకమాటలోపలనుండ వలయు। రారాజురతిరాజు రాజరాజును గూడి యొకమాటలోపల నుండ వలయు। పక్షియువృక్షంబుపాషాణమునుగూడి యొకమాటలోపల నుం డవలయు। ఫణిరాజుఫణివైరిఫణిభూషణుడుగూడి యొకమాటలోపలనుం డవలయు। దీనియర్థము దెలియగజూసుకొనుచు। మదివిచారించిపమునైమ మాసములను। సన్నుతిగ జెప్ప భావజ్ఞచక్రవర్తి। చెప్ప లేకున్న నగుమ నేది న్ననగవు॥

౧ నాగకేసరాలు- ౨ ౩ కిట్టకేసరాలు- ౪

సీ॥ అచ్చర యంగనయనిలాశ్వమునుగూడి యొకమాటలోపలనుండ వలయు। లచ్చియేనుంగునులావణ్యవతిగూడి యొకమాటలోపల నుండవల యు। వెన్నెలమల్లిక వెలమకయునుగూడి యొకమాటలోపల నుండవల యు। మంత్రియునగ్నియుమడుగును యొనగూడి యొకమాటలోపలనుండ వలయు। నీపదంబులదెలిపినవిప్పుడేను। బ్రస్తుతించెదనానార్థ పదవిదుల ను। దెలుపలేనట్టివారినిధీరులనుచు। బలుకకుండురు పరిహాసకులు ముద మున॥

సీ॥ రజకకవాటముల్ రహిందప్పియుండుట కేమి హేతువో దాని నెరు గవలయు। యిల్లును శేషువుహీనమైయుండుట కేమి హేతువో దాని నెరుగ వలయు। పాలిచ్చుమొదవునుబకపక్షిహీనమైయేమిటనుండెనో యెరుగవ లయు। సస్యంబుకస్మరిసంతోషవర్జమైయేమిటనుండెనో యెరుగవలయు। దీనియర్థంబు జెప్పిన దేసికునకు। నెలలుపండ్రెండు పురసతు నేర్పుతోడ। సన్నుతిగ జెప్ప భావజ్ఞచక్రవర్తి। చెప్ప లేకున్ననగుమ నేదిన్ననగవు॥

ఉతకరేక - కప్పరేక - చ్యాపల్లో వానక్క.

సీ॥ కొమ్ములుగలవని కోపించిపాఁడవమ కట్టిబంధించినగ దలఁకుండు। నీ
నముపొర్లమయొన్నాళ్ళకైనను బంధంబు వేసినపాలుగలవు। మేతకాసించ
దు మేఘుంబులోనీళ్ళుకావలెనను మండుకడుపునిండ। తనకడుపునిండినదా
రిద్ర్యములుబాపు బహుజీవరాసులు బ్రతుకవచ్చు। దీనియర్థంబు దెలియ
కదివిరినరులు। మఱివిచారించిపద్మనైమనూసములను। సమ్మతిగజెప్పభా
వజ్ఞచక్రవర్తి। చెప్పలేకున్ననగుదు నేచిన్నినగవు॥ చెరువు.

సీ॥ రాజీవనేత్రినీరాజ్యమెక్కడిదన్ననొక చేతకొప్పువెంట్రుకలుజూ
పె। పద్మాయతాక్షినీపట్టణంబేదన్న నవ్వుచునోష్ఠాణనడుముజూపె। బిం
బాధరోష్ఠి నీపేరేమిచెపుమన్న సొగసైనశుకవాణి మొగముజూపె। నిం
దీవరాక్షినీకెవ్వఁడు విభుడన్న తనవ్రేలి ముద్దుటుంగరముజూపె। విడిదిచె
పుమన్నబాలిక్షనడుముజూపె। కులముచెపుమన్నమరు కేళిగృహముజూపె।
తరుణిరమ్మన్న బుగ్గలుగరచిజూపె। భళిరవినవయ్య జారస్త్రీప్రౌఢతనము॥

సీ॥ ఎలనాగ నీదేశమేదేశమన్నను చెలివంగమానొక్క చేతజూపె।
భామరో నీవున్న పట్టణంబేదన్న చంద్రునిగూడి పాషాణమనియె। నిందీ
వరాక్షి నీయిల్లెక్కడన్నను తలనీరు మోసె నత్తరువుకింద। నేజాతి కో
మలి యెఱిగింపు మన్నను యేటిలోరెణ్ణెల్లు యిసుగవుచ్చె। నింతినీకుపిలువ
యెంతనియడిగిన చుక్కజూపి సుదతిసున్నజుట్టె॥

సీ॥మగువ నా మరదలా మారుతల్లివినీవు వరుసజెప్పవుగదె వదినగా
ర। అత్తబిడ్డవునీవు యనుగుచెల్లెలవైతె మనకువావులు గలవె మనుమరా
ల। గారాపునాబిడ్డ యేరాలు మరదలా నా కూతురవు గదె నాతి నీవు।
మాయత్తతమ్ముని మరదలు వదినెవా దాని పిన్నత్త నా మేనవదిన। తల్లి పె
ద్దత్త కోడలు తల్లిరావె। మారుటత్తకు మరదలుమనుమరాల। యనుచు వి
జ్ఞోడు వావులు బెనసి కలిపె। యొక్క వావిని వరుసగా లెక్క జెపుమ॥

సీ॥ ఇల్లాలు మనుమరాల్కిరీతి యాయనో మనుమరాలికియెట్లుమా

మ యయ్యె। మామ యే వావిని మరదినై యుండునో మరదియెందుకు గూర్చి మనుమడయ్యె। మనుమ డేవావిని మరి యల్లు డాయెనో యల్లుని ల్లా లెట్లు య త్తయయ్యె। అత్త యేవావిని ఆయెను కూతురు కూతురు సరియెట్లు కోడలయ్యె। దీని యర్థంబు జెనులకు దెలియరాదు। తెలియ వచ్చిన కవులకు తేటపడును। జలజహితరంగ సారసచంద్ర నిన్ను। వర్ణిన లుశాయ లేరెంత వారలైన॥

సీ॥ హరినీవనాకారి యాలి పరాచారి కూతురు వ్యభిచారి కొడుకు కారి। యమ్మ నిర్దయకారి యబ్బ సంకిలికారి య త్తపరాధారి యక్క మారి। మరదలు శుభచారి మనమడు జడధారి మరిది క్షీణాకారి మామ క్రూరి। వదినె నిర్దయకారి వాజిపత్ర్యాకారి భటుడు మర్కటరూపి పడకకవారి। చూడు నీమర్మమెల్ల నే నాడుదాన। నేడు నన్నేలి సిగ్గు కాపాడు కొమ్ము। సరసదరహాస ద్వారకాపురనివాస। మదనగోపాల రాధికా హృదయలోల॥

నీవనాకారి. లక్ష్మీదేవి- గంగ. మన్మథుడు- కైకేయి- వసుదేవుడు- భూదేవి- మాయ- నారదుడు- చంద్రుడు- సముద్రుడు- జ్యేష్ఠాదేవి- గరుత్మంతుడు- ఆంజనేయుడు- శేషువు.

సీ॥ తొమ్మండ్రు మొగుల నెత్తుకపోయె కోడలు చెల్లెలు సన్యాసి జేసుకొనియె। న త్త భూవరుల నెయ్యముమీర జెందెను కూతురు పదకొండ్రు గూడుకొనియె। మరదలొక్కతె మారుమనువుగట్టుకుపోయె నిల్లాలు పొరుగిండ్లకేగుచెంచె। వదినెగారును పల్కువానితో వర్తించె మేనత్త భానునిమీద వలచె। వావులిట్టట్లు జేసితి వన్నెకాడ। తగదు రావయ్య నీజాణతనము మాని। సరసదరహాస ద్వారకాపుర నివాస। మదన గోపాల రాధికా హృదయలోల॥

౧సరస్వతి, ౨సుభద్ర- ౩భూదేవి- ౪గంగ, ౫ ౬లక్ష్మీదేవి-౭
౮కుంతీదేవి-

క॥ సురలను సురలే మ్రింగిరి। పరగంగా బ్రహ్మవచ్చి భానుని మ్రింగెన్। అరయగ నప్పురి చెంతను। శిరహీనుని శివుడుమ్రింగె చిత్రముగాదే॥

చాపలను చాపలు మ్రింగినవి- మేక జిల్లేడుచెట్లను తిన్నది- ఎలుకపీతను నక్క తిన్నది.

క॥ జలచరము మిడుత మ్రింగెను। లలి మిడుతన్మ్రింగె జలచరంబు భుపినిదా। వలరాజు మ్రింగె రాజును। వలరాజును రాజు మ్రింగె వలనొప్పంగన్॥

క॥ నక్షత్రముపేరిట సతి। నక్షత్రము చేతబూని నాథునితోడన్। నక్షత్రమునకు రమ్మని। నక్షత్రము చేతికిచ్చి ననబోడ చనెన్॥

ఉత్తర అనే చిన్నది- హస్తము చేతపట్టుకొని- మూలకు రమ్మని- భరణిచేతికిచ్చి వెళ్లినది.

క॥ నక్షత్రపతికి దమ్ముడు। నక్షత్రము మగనిమామ నయమలరంగా। నక్షత్రశాయి మాకును। నక్షయ విభవంబులొసగు ననయము బ్రీతిన్॥

క॥ తారాపతిధరసుతుడును। తారాపతి యన్నసుతుడు తారాసుతుడున్। తారాపతి జంపుదమని। తారాలోకించిరపుడు దర్పోద్ధతులై॥

ఉ॥ మామను సంహరించి యొక మామను గర్వమడంచియన్నికా। మామను రాజు జేసె తన మామ తనూజుల కాప్తబంధుడై। మామకు గన్నులిచ్చి సుతు మన్ననునింతికి తాను మామయై। మామకు మామయైన పరమాత్ముడు మాకు బ్రసన్న మయ్యెడిన్॥

కంసుడు- జాంబవంతుడు- చంద్రుడు- పంచపాండవులు- ధృతరాష్ట్రుడు- రతీదేవి- సముద్రుడు- విష్ణుమూర్తి.

క॥ వాసవరవి సోమాసులు। వాసవ రవిసోమ సుతులు వాసవసుతులు। వాసవులురవులుసోములు। వాసవరవిసోమసుతునివాకిటభృత్యుల్॥

క॥ ఆకాంతామణి యుపరతి। కాకాశం బౌణకె తార లట్టట్లాడెన్। జోకైన గిరులు కదలెను। ఘకర్ధమగు తమము చంద్రబింబము గప్పెన్॥

నడుము- గోళ్లు ముత్యములు- కుచములు- ముఖము.

ఉ॥ కన్యకు నైదు జంఘలును కన్యకు నేడు విశాల నేత్రముల్ । కన్యకు నాల్గు కన్నొసలు కన్యకు నారుకుచద్వయంబునున్ । కన్యకు ద్వాదశంబరయ గావర మధ్యము గల్గినట్టియా । కన్యకు నీకునుం బదియు గావలె కస్తురి రంగనాయకా॥

మకరం- మీనం- ధనస్సు- కుంభం- సింహం- మిధునం.

క॥ కన్యకు నారు కుచంబులు । కన్యకు మరి నేడుకంఠ్లు గణుతింపంగా । గన్యకు నాలుగుబొమలును । కన్యకు బంద్రెండునడుము గలదా చెలికిన్॥

కుంభం- మీనం- ధనస్సు సింహం.

చ॥ పదియది పెక్కుమున్ గలుగువాడని తాయగదా దపించుచు । న్యుపకము లేని నాలవదియుం బదిరెండును భంగి మిక్కిలి । న్నెదగము రంగ మూర్ఛిలుచు నేడవదాని వొలంగ ద్రోచి తొ । మ్మిదికిని నీతు కన్నొసల మించియు నైదవ కౌనుగల్గియుం । గుమురుగ గుందనంపు పదకొండు చనుంగవ మీరి యుండ నిం । పొదవెడు యారు యెన్మిది మహోగ్రపు బాధను బొందె గాన వే॥ గడలుచుబోయి రెండవది కిన్న గడుంమతి గల్గు వాడ స । మ్మొద మొదవంగ నీవిపుడు మూడవవాడవుగమ్ము చెచ్చెరన్॥

ఆ చిన్నది యేలాగు మన్మథబాధ పడుచున్నదంటే- ఉదకములేనిస్థానమందునున్న ఎలుక పీత- మచ్ఛము యీ మోస్తరున తుల- ధనస్సు- సింహం- కుంభం- కన్య- వృశ్చికం- వృషభం- మిథునం-

ఉ॥ రాజిత కీర్తిశాలియగు రాయని భాస్కరు వేడ బోవగా । నాజికి నిల్లనున్ బరుని యాలికి నిల్లను నర్థికిల్లనున్ । దేజము పెంపులేని కడు దీనుని హీనుని వేడబోవగా । నాజికి నిల్లనున్ బరుని యాలికి నిల్లను నర్థికిల్లనున్॥

ఒక కవీశ్వరుడు వచ్చి కవిత్వంబు చేత నౌనంటే శ్లేషించి చేతితో చెపుతావా అనియడిగితే జేతితో చెపుతానని- గొప్పవారిని యుద్ధమునకు యాచిస్తే రమ్మనిన్నీ- అన్య స్త్రీ యా

చిస్తే పద్దనిన్నీ- దానమునకు యాచిస్తే యిస్తారనిన్నీ- కొద్దివాడిని యుద్ధమునకు యాచిస్తే వద్దనిన్నీ- అన్యస్త్రీ యాచిస్తే రమ్మనుమనిన్నీ- దానమునకు యాచిస్తే యిచ్చేదిలేదని యీ మాస్తరున చేతితో అభినయిస్తూ చెప్పినాడు.

ఉ॥ నూతి జలంబులోన పదునూరు శిరంబున నెద్దు మేయగా। నాతి పయోధరంబుతుద నల్లన వెన్నెల గాయుచుండగా। కోతికి పిల్లికూనకును ఘోరపు యుద్ధము గూడుచుండగా। యాతపు కొమ్ముమీద యొక యేనుగు సింహము వేటలాడగా॥

ఉ॥ మట్టి తుదాకుమీద నొక మత్తగజంబును మేత మేయగా। నిట్టులు నేరుపూచుకుని యెండిన చేనును మన్నబోవగా। గొట్టెను గొట్టెగొట్టెనట కొమ్ములుగాడిదె మొట్టబెట్టగా। నల్లులుబండిమీద నొక నాలుగు మాతులు యుండగాంచితిన్॥

క॥ లోకములోపల నొకసతి। భీకరముగజలధులన్ని పిడికిటబట్టెన్। కాకోకర్కోండ మ్రింగెను। యాకాశమునకర్కరిచెనమరులు మెచ్చన్॥

గీ॥ వంగతోటనుండు వరిమళ్లలోనుండు। జొన్నచేలనుండు ఛోద్యముగను। తలుపుమూలనుండు తలమీదనుండును। దీనిభావమేమి తిరుమలేశ॥

గీ॥ మొదట నూరుగాయ యెదిగినవంకాయె। ముదిరిన నెనమంద్రము మోంతకాయె। చూచురాజులకెల్ల చూడవేడుకలాయె। దీని భావమేమి తిరుమలేశ॥

పాలకీహాంగు.

మత్తకోకిల॥ సామజంబునల్పుగాదు షట్పదంబుతెల్లనా। మామకూతురాలుగాదు మాల్లుబోతు సింహమా। పాముకాటు విషము లేదు పట్టపగలు చీకటా। రాము వేటు సూటికాదు రావికల్పవృక్షమా॥

గీ॥ చనినవెనుకను రాకుండు జంటలెవియో। వచ్చినను జనక నుండు వ్యవస్థ లెవియో। మరలవచ్చుచు బోవునామహిమలెవియో। తెలియ జె

ష్టము దేటగ దెలియవిభుః

కీర్తి- అపకీర్తి- పుణ్యము- ...- కలిమి- లేమి.

గీ॥ ఇంట నుండును నెవ్వియవియొ। వెంటనుండును నెవ్వియో వేరుగాక। తప్పకను లయును తక్షణంబె। విమల మతులైన విజ్ఞాన విబుధులార॥

కలిమి- లేమి- పుణ్యము- పాపము.

ఉ॥ భండనభీము నీయెదుట పారక నిల్చిన శాత్రవుల్ బ్రహ్మాండలపుండరీక హరినాకనివాసులుపారినన్ బ్రహ్మాండలపుండరీక హరినాకనివాసులు చచ్చినన్ బ్రహ్మాండలపుండరీక హరినాకనివాసులు చిత్రమింతగన్॥

క॥ సన్నంబడిగిన నొకసతి। కన్నుల నెర్రంగజేసి కడుకోపముతో। సున్నంబిమ్మగొ కొమ్మని। చన్నులపై పైటదీసి చయ్యన జూపెన్॥

పైటదీసి ముత్యాల హారము చూపించినదని తాత్పర్యము.

క॥ సుభటుడు భటుడును హరి హరి। నిభమిభముం రథము రథము నెదిరించెనయా। రభసమిది యేమిచెప్పను। నభమగిలెన్ పుడమి గ్రుంకె నగములు పగిలెన్॥

॥ బావయునురిదింగనియా। యావులలోనొకటితెమ్ము యనగానపుడే। యావనియడిగిన వాక్యము। గావలయుంభాషలైదు గానొకపదమున్॥

ఏఆపురాబావా- ఏ-రమ్ము- మహారాష్ట్రభాషలో. ఆపు-రమ్ము- తురకములో. రా-రమ్ము తెలుగులో. బా-రమ్ము- కన్నడములో. వా- రమ్ము- అరవములో.

గీ॥ జలములందునీవు జలచరసిరిలేదు। పట్టిచుట్టి జీవబాధజేయు। సాగుబేగురీతి సారమునేయన। దీనిజెప్పరయ్య ధీరమతులు॥

నదులయందుండు ఆగురు.

గీ॥ తలపజనములవా త్రితకోతలకు నెల్ల। వలనుపడురంగుగలరసావర్తి లంగ। నల్లయుద్యోగగృహములై యాలయములు। గాగదనరారు కవుల సంఘములు మెచ్చ॥

శరాబుడ్డి.

గీ॥ పక్షములనుబుట్టుపక్షిరాజనము। పంటినోకుచ్చు దుండుఫణియుగాదు। కర్ణనందు వెలయుఘనభూషణముగాదు। కరమునందు నాడు కడియంబుగాదయా చెడ్డవారికెపుడు జెరుపుజేయు। జీవనంబులిడును జీవుండుగాకుండు దీనిభావమేమితిరుమలేశ॥

కిటకు.

గీ॥ చీరెగట్టి రాత్రి నిద్రనవదిగుండు। పగలు చీరె విడచి పనులు చేయు। చేడె కాదు గాని చేవాడికేసయా। దీనిభావమేమి తిరుమలేశ॥

నూరకత్తి.

గీ॥ పాదంబులెనిమిది పరగ కొమ్ములు నాల్గు। నడ్డముగను నడుచు నసురగాడు। శిరము తోకయు లేదు జీవంబు దనరుసు। దీనిభావమేమి తిరుమలేశ॥

ఎలుకపీత.

గీ॥ కాళ్లు చేతులిల్ల కడుపు కొంచము గాదు। కంట కూడు గుడుచు కలహకంఠి। అంటిన మొరబెట్టు నదియేమి చోద్యమో। దీనిభావమేమితిరుమలేశ॥

మృదంగము.

గీ॥ తలయు తోకయు గలిగి చెరగు నాలుక లేదు। కండ్లు రెండుగలవు గానరావు। పట్టిమూదినంత ప్రాణంబు లేదయా దీనిభావమేమి తి తిరుమలేశ॥

పాముపూసవన్ను.

గీ॥ చూడ నిర్జీవంబు జూస్తే భ్రమింతురుగాని। కళ్లు వున్నవిగాని ప

ళ్లులేవు। వాతిమున్నది గాని వర జిహ్వ లేదయా। దీని భావమేమి తిరుమ
లేశ॥

పాముకూసము.

గీ॥ దేహమెల్లకండ్లు దేవేంద్రుడును గాడు। నరవాహనము లేక నడ
చిపోడు। తనకు ప్రాణము లేదు తగిలి జీవులజంపు। దీని భావమేమి తిరుమ
లేశ॥

వల.

గీ॥ ఒంటసారము లేదు యొడలెల్లనిండెను। పళ్లు వేళి జేసి వాయి లేదు।
తనకు ప్రాణము లేదు తగిలి జీవులజంపు। దీని భావమేమి తిరుమలేశ॥

దువ్వెన.

గీ॥ ఆకసముననుండునది పక్షియును గాదు। తోకగలిగియుండు మేక
గాదు। త్రాడుగలిగియుండు తలపయొద్దను గాదు। దీని భావమేమి తిరుమ
లేశ॥

గాలిపడగ.

గీ॥ రాతిమీద మాను రాపాడుచుండంగ। మానుమీద వేళ్లు మలయు
చుండు। వేళ్లమీద నీళ్లు వెదజల్లినట్లుండు। దీని భావమేమి తిరుమలేశ॥

గంధపుసాన.

గీ॥ కాళ్లుగలిగియుండుకదలదట్టిట్టును। నోరు లేదు పెక్కు నీరుద్రావు।
తనకు ప్రాణి లేదు తరువుల భక్షించు। దీని భావమేమి తిరుమలేశ॥

గంధపుసాన.

గీ॥ మూడుకాళ్ల మొసలి మూతిపండ్లను లేవు। లేవబట్టుకున్న లేవలే
దు। కాలవశము చేత కర్రల భక్షించు। దీని భావమేమి తిరుమలేశ॥

గంధపుసాన.

గీ॥ ఒకనికొంటికాలు నొనరకన్నులు రెండు। తలకు శిఖయు గలుగుత

పసిగాఁడు। రాజసభలలోనరంజిల్లుచుండుసు। దీనిభావమేమితిరుమలేశ॥

కత్తిగంటము.

గీ॥ మ్రానుకాలవేళ మహిలోననొకజాణ। వ్రానితిరుగుచుండుపొందుగాను। కాలసున్నమాను కడురమ్యమైయుండు। దీని భావమేమి తిరుమ లేశ॥

పాముకోళ్లు.

గీ॥ మగడు క్రిందనుండు మగువతాఁ పైకెక్కు। భోరుకలిగిలరుగుముద్దురాలు। కారువస్తువులనుఘనులారగింతురు। దీనిభావమేమి తిరుమలేశ॥

తిరగలి.

గీ॥ కాళ్లడన్నగనిచ్చు కౌఁగలించగనిచ్చు। పైకిప్రాకిచనులబట్టనిచ్చు। కారుసారమెల్ల ఘనులు ద్రావుమరయా। దీనిభావమేమితిరుమలేశ॥

తాటిచెట్టు. కల్లు.

గీ॥ కాయమీదమానుకడురమ్యమైయుండు। మానుమీదలతలువాలయుచుండ। లతలమీదవేళ్లు నుత నాట్యమాడును। దీనిభావమేమితిరుమలేశ॥

వీణ.

గీ॥ అష్టబాహులలరు నదిరక్కసియుగాదు। వెలయుజన్నిదంబు విప్రుఁగాడు। తోకనుండు చెవులు దీప్యహాధ్వనిచేయు। దీని భావమేమి తిరుమ లేశ॥

పికులగాట్నము.

గీ॥ ఎద్దునెక్కి తిరుగు నీశ్వరుండునుగాడు। నలుమొగములుగలవు నలువగాఁడు। గర్భయుగమునెగడి కడుభ్రమింగుధాన్యంబు। దీనిభావమేమి తిరుమ లేశ॥

గోనె.

గీ॥ నాగరికుఁడుసజ్జనకులోత్కృష్టుండు। నీశుమాటిక్కి నెద్దునెక్కి తిరుగు

ధరణి నిరు మొగములు. ధాన్యములను మిశ్రింగు। దీని భావ మేమి తిరుమలేశ॥

గోనె.

గీ॥ దాటుకోటగట్లు దాట్ల గుఱ్ఱముగాదు। మెడను నలుపు గలదు న్యా
డుడుగాడు। యిల్లుగట్టనిలుచు నిల్లాలుగాదియా। దీని భావ మేమి తిరుమలేశ॥

ఊరపిచ్చుక.

క॥ ఆకాశ గలసియుండును। ప్రాకటముగ బుష్పించదే ఫలముగ నా
స్తిగ। పై వినుకిడి కాచును। దీని భావ మేమి తిరుమలేశ॥

తాటియాకుగొడుగు.

గీ॥ జన్మకాలమందు జన్మించు పర్ణముల్। వలప పుష్పింపదే ఫలము
లేదు। మారుపర్ణమిడని మరి వృక్షమేదయా। దీని భావ మేమి తిరుమలేశ॥

తాటియాకుగొడుగు.

క॥ ఇనుజూచిన వికసించును। మనుకొని శీతాంశుజూచి ముసుళ్ళించు
నయా। యనయగ కమలముగాదిది। పని బడి ముఖ్యముగనుండు పాంథు
లవద్దగ॥

గుడ్డగొడుగు.

గీ॥ మెట్టమీదనుండి మేతకు దిగదెపు। నియ్యసిళ్లు గావి తేలబడును।
కలేకాని యింతమాంసము లేదు దీని భావ మేమి తిరుమలేశ॥

పశువుగనుక్క పాలపొదుగు.

ఉ॥ ఊగులబట్టిగా దిగిచి యున్నతమైన కుచద్వయంబుపై। జీరె దో
లంగజేసి తడిజేసి చనుంగవబట్టి పొక్కటా। గోరిన కోర్కె దిక్కు [illegible] నిం
మలినావల సాగనంపెని। సారము దెల్పుడీ సురత సౌఖ్యమెఱింగిన జాణ
లందరుగ॥

మేకపాడుగున పాలు పితకడము.

క॥ రాతిరిబైనము నడచును। చేతనుదాగొలబూని జిగిబిగిదరుగ।

వాతనొకముద్దవేయ నతీతముగా నోరు దెరచు దిరుమలనాథా॥

తుమ్మరసాన.

క॥ కరచరణంబులు గలిగియు। కరచరణవిహీనుచేత గడు మర్దలు
డై। జలచరుడు బట్టుబడెనని। శిరహీనుడుజూచినవ్వె జిత్రముగాదే॥

కప్ప. పాము- పీత.

క॥ నేలంబడిపొర్లాడుచు। గాలికి నోరావలించి గ్రక్కున మ్రింగున్।
బోలించుచుండుమంటల। నాలస్యములేకదాని నమరగ జెప్పుడీ॥

తిత్తిగడ.

గీ॥ మూడుశిరములుండు మదిమొప్పపదికాళ్లు। నలరు మూడు తోక
లారుకన్ను। లరయనాలుగుకొమ్ములలహస్తములు రెండు। దీని భావమేమి
తెలుపు లేశ॥

అరక.

క॥ పదికాళ్లునారుకన్నులు। వదనంబులుమూడు మూడువాలంబుల
తో। బమునైనచోటదిరిగెడు। నిదిచెప్పినవారు పెద్దలీసభలోనన్॥

అరక.

మత్తకోకిల॥ చుట్టుదిరుగును రెండుమూతులు జూడ నాలుగు కన్ను
లున్। నట్టనడుమను రెండుతోకలు నడుచుయెన్మిదికాళ్లనన్। గట్టుపుట్ట
ల మెట్టమిర్రిల గాడిగా బెకలించెడున్। బట్టుగాగని దీనిభావము బండి
తులు వెలయింపుడీ॥

అరక.

క॥ ఉడికియునుడకనిదొకటి। వడినుడికినదొకటియచ్చ పచ్చిదొక
టియున్।గడునమలనందమానది। వడిదీనిని జెప్పవలయు వరసరసులిలన్॥

పోగచెక్క- సున్నము- తమలపాకు.

క॥ ఇలవృక్షులతలబుట్టిన। చెలియలుముగ్గురునుగూడి చెలగుచు వేటన్।

తలవాకిట రమియుండిరి। తలపగ తః । రక్తధారలుగురిసెన్॥

స్తన్యము- పోగచాక్కు- తః

క॥ శ్రీపక్షిరాజగమనున। కాపట్టు, రూపనగు భరమునకున్। రూపింప నుభయ భాషల। జూపుండొక పేరి చోద్యము మీరన్॥

వీరిగుండు.

మ॥ రమణుం డుండెడు చోటికిన్నకియచే రంజిల్లుపుష్పావళిన్। ద్విమలంబైన పసిండిపెట్టెనిడి విస్తీర్ణంబుగా దానిపై। గ్రమమొప్పన్నఖచండికాధవు జగత్ప్రాణోద్భవున్సంపెగ। న్సుమబాణాంగి లిఖించిపంపె సుదలో జోద్యంబు రెట్టింపగన్॥

పైశ్లోకది తామరమొగ్గ- సర్పమును వ్రాయడము వాయువును రాకుండాను. సాంబమూర్తిని వ్రాయడము మన్మథుడు రాకుండాను. ఆంజనేయులను వ్రాయడము సూర్యుడుదయించకుండాను. సంపగి పువ్వును వ్రాయడము తుమ్మెద రాకుండాను. ఆంజనేయులను వ్రాయడముకు రెండో అర్థము నాయొక్క యావనము యీలాగున కాపాడుకుంటున్నాను నీవు శ్రీఘ్రముగా రావాయే అని సూచన నిమిత్తము.

క॥ సతికైదు ముల్లు కలవట। పతిచేతను రెండుముల్లు బలిమి నిపీడెన్। హితమున నొక ముడివీడెను। రతిసేయగ రెండుముల్లు రమణికి వీడెన్॥

రవికముడి- పోకముడి- మనస్సుముడి- కొప్పుముడి- బొమముడి.

క॥ కమలా కమలా మోదిత। కమలా కమలావతంస కమలా కమలా। కమలాకమలాన్వయవర। కమలాకమలాస్య రాధగాన రెయిచటన్॥

క॥ కమలాకర కమలాకర। కమలాకర కమలకమల కమలాకారా। కమలాకర కమలాకర। కమలాకరమైన కొలను గనిరకాంతల్॥

క॥ విషధరనుత విషధరసుత। విషధరనుత విషధరాంత విధుధర వినుతా। విషధరసుత విషసుషపతి। విషధర విషవరదనిన్ను వేమరుదలతున్॥

క॥ గంగం దరంగ రవమెస। గంగంబ్రి వహించు నిన్ను గంగనుగొ.

నియే। గంగను బురములనెల్లన। గంగల నిర్జరులపురి తగం గనుపట్టెన్॥

క॥ లోలాలిలాలి లీలా। లీలా లీలాల లేల లీలలు లలు లే। లోలో లై
లాలలలో। లీలాలోలాలు లోల లేలూ లేలా॥

గీ॥ నాని నీనాను నేనును నానినాను। నాన నేనును నిన్నానినున్న
నన్ను। నెన్నసున్నను నిన్నెన్న సున్న నాన। నిన్న నేనన్న సున్న నన్నె
న్ను నన్ని॥

సీ॥ రాజనందనరాజ రాజాత్మజులు సాటి ధరణి నన్నయవేము ధరణి
పతికి। రాజనందనరాజ రాజాత్మజులుసాటి ధరణినన్నయవేము ధరణిపతి
కి। రాజనందనరాజ రాజాత్మజులుసాటి ధరణి నన్నయవేము ధరణిపతికి।
రాజనందనరాజ రాజాత్మజులుసాటిధరణి నన్నయవేముధరణిపతికి। భావ
భవ భావసత్కళా భావములను। భావభవభావసత్కళా భావములను। భా
వభవభావసత్కళా భావములను। భావభవభావసత్కళా భావములను॥

ఉ॥ రాధితరాధిరాధి రథరాధిత ధీదితపూర్వనీయ సాంద్రాధిత నా
ధినాధి తరదారిత రారితరారివైరి సుఛ్రాధిత నా ధ నాయతర చారిత
కూరిత వారితాంబు విస్ఫూధిత సాధులోక నుత పూరిత రాజిత పూ
ర్వశేఖరా॥

చ॥ తనతవ తాహితాహి యహితార కిమాల కలాలచంచరీ। జవ
జవ జాలజాల నహిజాలక వాలకపీలచుంబినీ। కవకవ కావకావశుక కా
హిత కాహిత లోకసుందరీ। నవనవ నావనావని వనాహితనాహితపూ
ర్వశేఖరా॥

క॥ జలకలకలకులకులకుల। జలదకలక జలజములుకజలమాలకపరూ।
ఫలనిలవలలన యులసత్ఫలదాయక ఫలిత లలిత పూర్వవివేకా॥

చ॥ శరశర కాండకాండ హరిచందన చందన నాగనాగ సుందర

ధర చంద్రచంద్ర శ్రీత నారద నారద తారతార భూ। ధరధగ రాజరా
జ హయదానవ దానవ కాశ కాశ సత్పురిపురమారిమారి హార భూధ
రి భూధర కాలకాలవా॥

క॥ మంచివి కుంచెడు శనగలు। మంచమ్ముపై నెండబోసి మరచితి న
క్కా। మించెను వర్షము గురిసెను। గుంచములోపోసినను పిల్లి కూనలు
బెట్టెఁ॥

మంచివి కుంచెడు శనగలు మంచముపై నెండబోసి మరచితిని, అక్కా మించను వ
ర్షం గురిసిన కుంచములో పోతును అక్కా పిల్లి పిల్లలు పెట్టినది

సీ॥ భుజగలోకాధిశ భోగితల్పశయాన హరిరూపధర మహాపురుష
యనుచు। నతులాబ్జ ముకుళవన్మోహితపాంచి రాజీవ రామార్చనీయ శ్రీరం
గయనుచు। మారీచ మదభంగ మహాత్త వాయువ్యాస్త్ర శరప్రసదృశ నే
త జలజయనుచు। సముచిగ్రవమాణవసర యోగిసిద్ధాణ కరిరాజవరద
శ్రీకాంతయనుచు॥ దలకు నులుకు నలంగు వెగ్గలుచు బలుకు। సఖులన
యనస్వన శిరోజ చరణ కలన। పవన కందర్ప ఘనహంస జవనసురగ।
భట నట ప్రియ సముదాయ పటిమదోప॥

తాత్పర్యము.

౧ నాయిక సఖులయొక్క నేత్రములు జూచుటచేత వాయువును- అతనికి వాహనము
లయిన లేళ్లను స్మరించుటచేత భయపడుచున్నది- అందుకు సర్పమందు శయనించగ స్వామి
ని స్మరించుటచేత వాయువునకును నరసింహరూపమును ధరించిన స్వామిని స్మరించుటచేత లేళ్ల
కును భంగముగును.

౨ నాయిక చెలికత్తెలయొక్క కంఠధ్వని వినుటచేత మన్మథుడును- అతనికి భటులయి
న కోకిలలును తోచుటవలన నులుకుచున్నది- అందుకు సాంబమూర్తిచే వర్ణింపబడిన పా
దాబ్జములుగలవాడా యనుటచేత మన్మథునకును- రామునిచే నర్చించపడిన శ్రీరంగనాయకు
డా యనుటచేత కోకిలలకును భంగముగును.

౩ నాయిక చెలికత్తెలయొక్క శిరోజములు జూచుటచేత మేఘమును ఆసమయమందా

డెడి నెమలియును- దోచుటవలన నలిగిపోవుచున్నది- అందుకు వారించుని ర్మాణచిన ప్రసిద్ధము యున వాయవ్యాస్త్రం గాండా యనుటచేత- మేఘములకును- శరత్కాలంబున పుట్టిం చిన నేత్రపద్మములకుగాండా యనుటచేత నెమ్మళ్ళకును భంగమగును.

౪. నాయిక చెలికత్తెలకొరకు పాదములు జూచిన హంసలును వాటికిష్టమగు పద్మము లును దోచుటచే భయపడి పరుగుచున్నది అందుకు అతిశయమగు వర్షాకాలమున యోగనిద్ర నుండిన గాండాయనుటచే హంసలకును- శరిరాజునకు వరిమిచ్చిన లక్ష్మీవల్లభా యనుటచే ప ద్మములకును భంగమగును.

సీ॥ ద్విరదంబునడతోడ సరిరాక ముఖభంగ దశనొంది నవ్వుతో దన
రజూచె। గగనంబు నడుముతో బగజెంది మధ్యమాంతము నొంది వేణితో
సమానబూనె। సారసం బంఘ్రితో సరిరాక సావర్ణ్యగతిమాని మోవితో
గదియజూచె। కనకారి కటితోడ నెనమాని నారివేషముబూని మేనితో
సరిగజూచె। దిరిగి సతికింత కుచ బాహు సరస నాసికలకు భయమం
ది మొరపెట్టి గతులు మాని। యొరగి ధరగూలి వత్తులై యొకట రెంట।
మూట వాల్గంటితో సరినొనయవయ్యె॥

తాత్పర్యము.

ద్విరదము నడకతో సరిరాక ముఖం భంగమయి- అనగా ద్వి అను అక్షరంపోయి- రదమ యి - నవ్వుతో సమానం గాజూచెను గగనము నడుంతో విరోధపడి మధ్యమము పోయి అ నగా గ్ర అనుఅక్షరం పోయి గనమయి- మేఘమయి- కొప్పుతో సమత్వముబొందెను. సారస ము పద్మం పాదంతో సరిరాక సావర్ణ్యగతమాని అనగా సా అను అక్షరంబోయి రసమయి మోవితో గదియజూచెను- కనకారి- బంగారపుచక్ర ంకటితో సమత్వమునుబొందలేక నా రివేషం పూని అరి అను అక్షరంలేని వేషమును ధరించి అనగా కనకరూపంవహించి శరీరం తో సరిగాజూచెను- తిరిగి తలక్రిందై అనగా రదము దరమై గనము నగమై రసము- సరమై- కనకం- కనకమై భయమంది- భయార్థకమయి మొరబెట్టెను. అన దరము అనగా శంఖం మొ రబెట్టెను. గతులు మాని నడవలేక అనగా నగము నడవలేకపోయెను- ఒరగి- ఒరిగిపోయి అన గా సరము ఒరిగిపోయినదనుట- ధరగూలి- భూమియందుబడి వత్తులై తీగలై ఒకవిధము- రెం డు విధములు- మూడువిధములచేతను ఆ స్త్రీతో సరిగాకపోయెను.

గీ॥ అతివ కచ నాభి జఘన దేహాననము తమినద రసా లతారాజ

పానిరాన। రణమునంతమునాదినేత్రి గళభుజ న। ఖోష్ఠకుచవచోదంతము లుభయగతిని॥

టీ॥ అవి- స్త్రీయొక్క నాభి. జఘనం దేహం- ఆననం అనంతము- చివర యక్షరం లేకుండునట్టి॥ తమీ, నద, రసా, లతా, రాజ- వీరలను నిరాకరించుచున్నది. నేత్రి, గళి, భుజ, నఖ, ఓష్ఠం, అనాది- ఆద్యాక్షరంబులేని- మీన, దర, వాల, తారా, జహ వీట్లనునిరాకరించుచున్నది. కచం, వాక్కు, దన్తములు- ఉభయగతులన్- రెండు ప్రకారములచేతను అనగా ఆది అంత అక్షరములులేని మీనద, రసాల, తారాజములను నిరాకరించుచున్నది- మీనదములనగా చక్రవాకంబులు- తారాజములనగా ముత్యములు.

తే॥గీ॥ అధర ముఖవర్ణ సూన్యంబు లతివకుచము। లాననాకారరహిత మబ్జాక్షిమేను । అజ జఘనమండలము హంసయాన కురులు । చరమభాన్వితకరములు చానతొడలు॥

టీ॥ స్త్రీయొక్క కుచంబులు- అధరశబ్దంలో మొదటివర్ణంచేత శూన్యంబులు అనగా ధరములు, పర్వతములు- స్త్రీయొక్క శరీరం- ఆననశబ్దమందు ఆకారం లేనిది- అనగా- ననవలెనున్నది- హంసయానకురులు జకారంలేని జఘనమండలం- మేఘమండలం. స్త్రీయొక్క తొడలు- అన్తమందు- భకారంతోగూడిన కరములు అనగా కరభములు- మణిబంధంమొదలు- కనిష్ఠాంగుళివరకునుండు చేతియొక్క భాగంబునకు- కరభమనిపేరు.

క॥ విధుకృత కదనము వదనము। మధుకర నికరముల గేరు మగువ చికురముల్ । విధు మధుకర లీలాజయ మధురోక్తులు పిక్కలౌర మధురాధరకున్॥

చంద్రుని జెయించిన ముఖంగలది- తుమ్మెదపంక్తిని తిరస్కరించిన కురులుగలది- చంద్రునియొక్క సుధారసమునుజయించిన వాక్కులుగలది- వి- విగతమయిన ధు- ధువర్ణంగలిగిన మధుకరశబ్దమును జయించిన పిక్కలుగలది అనగా మధుకర అను శబ్దములో ధు- అనే అక్షరముపోతే మకర అనే శబ్దమాయెను- అనగా మొసలిని జయించిన పిక్కలు కలదని తాత్పర్యం.

చ॥ సతికుచ వాక్సమత్వ మరిజాత సుధల్గొనబూనివాముసై। హతులయి వారిజాత వసుధాకృతులూని యుదృష్టితంబ ని।ర్జిత రుచిగాంచి

యుం మది నరిత్వము జెందిన చంద్రసేవధిస్థితని ముఖాంగముల్ గెలి
చె సీతగదిన్నిట నోంటినోడినన్॥

టీ॥ స్త్రీయొక్క కుచంబునకు వాక్కునకు- అరిజాత, సుధలు సమానంకాపోయి వా
దులై పకారవాదినిగల్గవై హతులయి- వారిజాతవసుధలయొక్క రూపకంబులాసియు- నేత్రాని
తంబములచేత జయింపబడిపోయి తుదకు శత్రుత్వంబొంది-తుదియందు అనుపమునుబొం
ది- వారిజాతారి, వసుధాగ్నైన ముఖమున్ను- శరీరమున్ను వాటిని గెలిచెను యెన్నివిధం
బులనైన ఓడుటయేగాని గెలుచుటలేదు- అరిజాత అనగా చక్రవాకం.

చ॥ అలఘన చంద్రబింబ సమమై తనరారెడు వక్త్రమందులో।
గలసిన నామ భేదములకైవడి నొప్పెడు కప్పుకొప్పుచెక్కులు రదనాం
శుకంబు లవి గుబ్బలకున్ సరిరాకపోయ। చేతులు సరులయ్యెదానివలె
నున్నది చిత్రపుటూరు బోటికిన్॥

టీ॥ ముఖం సాంద్రమయిన చంద్రబింబం వలెనున్నది- అందులో గలసిన నామభేదము
లనగా- ఘనం- చంద్రం-బింబం- నల్లనికొప్పు మేఘంవలెనున్నది చెక్కులు- చంద్రం- కర్పూ
రం లేక వెండివలెనున్నది- రదనాంశుకం అనగా నధరోష్ఠం- బింబంవలె- అనగా దొండ
పండువలెనున్నది- అవి అనగా పర్వతం కుచములకు సరిరాకపోయెను- చేతులు హారంబులా
యెను చిత్రమయిన నూగారు ఖడ్గం వలెనున్నది.

గీ॥ కాంతనెమ్మోము గెల్చు కంజాతములను। కాంత కంజాతములు
గెల్చు కంధరమును। కంధరంబును సమదశంఖంబు గెల్చు। శంఖభావం
బు నయ్యర్ధచంద్రు గెల్చు॥

టీ॥ కాంతముఖం పద్మములను గెల్చును- కాంతశిరోజములు మేఘమును గెల్చును- కం
ఠం శంఖమును గెల్చును- నుదురు అర్ధచంద్రుని గెల్చును.

చ॥ నల శశిబింబ సంపదలణంచు సతీమణి పాణిపల్లవం।బులు నగు
మోము నారు జిగిమోవియు వాక్యములున్ బిసాళిమీ।నులగరిమంబణం
చు నరుణోష్ఠ భుజంబులు నుందయానముల్। నెరుకలు నాసికంబుతగు
నత్తులు నిబ్బరపుం గుచంబులున్॥

# నానార్థగాంభీర్యచమత్కారిక.

టీ॥ సతీమణియొక్క పాణిపల్లవములు, నగు యీ రెండును పద్మసంపద నణచుచున్నవి. అనగా పాణిపల్లవం సాదృశ్యం చేత పద్మమును గెలుచుచున్నది- నవ్వు వెన్నెల గాన పద్మ కాంతి నణంచుచున్నది. మోము చంద్రుని సాదృశ్యం చేత గెలుచుచున్నది- అది సర్పం గాన రాహువై చంద్రుని కాంతి నణచుచున్నది- మోవి సాదృశ్యం చేత దొండపండును గెలుచుచున్నది- వాక్యములు శుకములుగాన దొండపండ్లను అణచుచున్నవి. అరుణోష్ఠయైన స్త్రీయొక్క భుజములు సాదృశ్యంచేత తామరతూండ్లను గెలుచుచున్నవి- మందయానం గజం గాన తామరతూండ్లను అణచుచున్నది- నెరుకులు- అనగా శిరోజములు సాదృశ్యంచేత తుమ్మెదలను గెలుచుచున్నవి- నాశికం సంపెంగపువ్వుగాన తుమ్మెదల నణచుచున్నవి. కన్నులు సాదృశ్యంచేత చేపలను గెలుచుచున్నవి- కుచములు చక్రవాకములు గాన చేపలను అణచుచున్నవి.

చ॥ మృగధరబింబ సంపదలమీరు వధూటిముఖంబు వేణిచె। ల్వగును
నుజూపు కొనుకటియందపుటూరును మోవిపల్కుల। బ్జగునుపసాళి చంద
ములబైకొనునంఘ్రిదరస్మితాక్షులున్। బిగిచనులున్ భుజంబులును పేర్మి
నడంల్ కురులంగనింబులున్॥

వధూటియొక్క ముఖమును- వేణి రాహువుగనుక చంద్రబింబముయొక్క సంపద నణచును- నునుజూపును- కొనును- మృగసంపద నణచును- కొను సింహమని తాత్పర్యం- కటి- అందపుటూరును- కరసంపదను- కొండలయొక్క సంపద నణచును- ఊరు- వజ్రాయుధమని తాత్పర్యం- మోవిపల్కులు- బింబ అనగా దొండపండును- అణచును- పలుకులు- చిలుకలు అని తాత్పర్యం- అబ్జ- పద్మములు- చేపలను- పాదములను- చిరునగవును- పద్మములను- చిరునగవు వెన్నెలయని తాత్పర్యం- అక్షులు- చేపలు- చేపలను- చనులు- చక్రవాకములు [illegible] చేపలను దినునని తాత్పర్యం- భుజములు- నడుకలు- తామరతూళ్లను- నడుములు [illegible] తామరతూళ్లను దినునని తాత్పర్యం- కురులు- అంగములు- తుమ్మెదలను- [illegible]- చంపకములని తాత్పర్యం.

చ॥ యువిదమిటారి చన్నవకనోడి గుబ్బచ్చములూనమాచు రెం। డవత
నుబూపయుం మొదటివైజగుణంబును వెండిపీగిమె। త్తవడిరజస్థతింపోర
గి తాపి[illegible]త్రియన్మై యుదాత్తతా। ధివసతియయ్యాశొప్పెను గలింగన
జాలకతు[illegible]చనే॥

సుందరియొక్క - చనుగవకు గుచ్ఛం. పువ్వుగుత్తి- భిన్నమై- కు- లేనిదై- గుచ్ఛముగు ట రెండవశరీరం- నిజగుణమును వెండియు- తొలుదొడ- వాడిపోయి- పరాగం పోయి- స్థానం చెడి- గకారం లేకుండుటకాశ్రయమై- ఔన్నత్యమునకు స్థానమయ్యెను- ఉకారం చేత గ్రహింపబడిన లకారమునకు స్థానమయి- ఆ స్తనములయొక్క రీతిని పొందలేక తుచ్ఛ మయ్యెను అని తాత్పర్యం.

క॥ కొమరుగుబ్బలతోఁ బోరనగము। లావృద్ధిగనియారుగమనమునకు।
లాగి మొదటపుం భావంబైతుమ। పాక్కలికోడెగతులుగలుగనికనరే॥

స్తనములతోఁ బోరలేక నగములు- మిక్కిలివృద్ధిగని- ఆకారవృద్ధిఁబొంది-నాగములై- అరు- గమనములకోడి-పౌరుషమునుబొంది-మొదట- పుం-శబ్దముగలదై పున్నాగమై భూమియందునా టోడెను.

గీ॥ కచకుచాననగళనేత్రకరయుగముల। కళికుభృచ్చంద్రశితరవారిజ
లతలోడి। పారెధరజొచ్చెగృసియించెనీటమునిగె। బంకమునజిక్కెనిడు
ద్దలైబయలుకురికె॥

కొప్పునకు - కుచములకు- ముఖమునకు- కంఠమునకు- నేత్రములకు- చేతులకు- తుమ్మెదలు - పర్వతములు - చంద్రుడు - శంఖం , పద్మములు - లతలు - వోడిపోయి తుమ్మెదలు పారిపోయినవి. పర్వతములు భూమిలోకి వెళ్ళిపోయినవి. చంద్రుడు క్షీణించుచున్నాడు. శంఖం నీళ్ళలోకివెళ్ళిపోయినది. పద్మములు బురదలోకిచేరినవి. లతలు పొడుగులై పయికి పడిపోయినవి.

గీ॥ పల్లవంబూనిసఖియమేనెల్లజేసి। పద్మగర్భుండులాదీసి వాగుడి.
చ్చి। బూవిసర్జించియప్పుడప్పువ్వుబోడి। డెందమొనరించెసందేహమెం
దనేలా॥

చిగురుటాకులతో చిన్నదానిశరీరమంతా చేసి బ్రహ్మదేవుడు పల్లవంబు అనేశబ్దంలో -ల- అనేఅక్షరముతీసివేసి, -వ- అనేఅక్షరముకు గుడియిచ్చి, -బు- అనేఅక్షరముతీసివేసి శేషించిన అక్షరములు పవి అయినవి. పవి అనగా వజ్రాయుధముగా ఆచిన్నదానికిమనస్సును చేసినాడని తాత్పర్యం.

గీ॥ కిసలయంబుననీమేనుబూసగజేసి। సరగకీదీసి యాయూడ్చిసా
గుడిచ్చి। జేసెగాఁబోలుధాతసీచిత్తమురర। గాకగల్లునెసీపునీకఠినబుద్ధి॥

చిగురుటాకులు అన్నీనీయొక్క శరీరం జేసి కిసలయం అనేశబ్దంలో -కి- అనే అక్షరము తీసివేసి -య- అనేఅక్షరముతీసివేసి -స- అనే అక్షరముకు గుడి యిచ్చి శేషించిన అక్షరము ఱుశిల అయినవి. శిలఅనగా రాయి, బ్రహ్మదేవుడు రాయిగా నీ మనస్సును జేసినాడాయేమి, అని తాత్పర్యం-

సీ॥ ఘనకేశియనినీవుచనకరాకుసమీర భుజగరోమాళియీపువ్వుబోణి। మీనాక్షియనినవో మీరకుకోకంబ చంద్రికాహాస యీచంచద్వపదన। బింబోష్ఠియనినవో బెదరించకుశుకంబసాంకవామోదయీసన్నుతాంగి। పద్మాస్యయనినవోకలహించకుమృగాంక స్వర్గ్భాను వేణియీజలజపాణి। శ్వాసవక్షోజవచనాస్యవాసవముల। బంధువులుగానమీకు జెప్పంగవల సె। నిటులవినకున్నపరువులనిడుటయెగిరి। పడుటకూయుటకందుటఫలము మీకు॥

౧- ఓ వాయువా మేఘములవంటి తలవెంట్రుకలుగలదనిముట్టరాకు- భుజగమువంటినూగారు- గాలిని మ్రింగునని భావం-

౨- ఓ చక్రవాకమా మత్స్యములవంటి నేత్రములుగలదనిఅధిక ప్రసంగముచేయకుమీ వెన్నెలవంటి నవ్వుగలది- చక్రవాకములకువిరహం గలుగును-

౩- ఓ చిలుకా దొండపండువంటియధరముగలదని బెదరించకు- యీవిడ పునుగు వంటి పరిమళం గలది- పునుగుపిల్లి చిలుకనిజంపునని తాత్పర్యం-

౪- ఓ చంద్రుడా పద్మముఖియనికలహం చేయకు- రాహువువంటిజడగలది- రాహువుచంద్రుని మ్రింగును- గాలి శ్వాసమునకుబంధువు- చక్రవాకముస్తనములకు బంధువు- వచనములకు చిలుక బంధువు- ముఖమునకుచంద్రుడు బంధువు- యీప్రకారం బంధువులుగనుకమీకు చెప్పవలసివచ్చెను- అటులవిననియెడల- పారిపోవుట- యెగిరిపడుట- కూయుట- కందుట- మీకు ఫలము. అధికప్రసంగము చేసినవారికింతే ఫలమని తాత్పర్యం-

సీ॥ రాగాదనక చక్రరాజి తన్నలయింప రాజానుజా మనోరమణ యనుచు। కోడిగంబెనయ జొక్కుట సదాగ్రహమాది ననుగాడ్పునోంప శేషాంకయనుచు। ముఖవరాంతరరంగ ముచితమేయన తమీ గమను జేచగ దమశ్శమనయనుచు। తుది శరస్థితి జేయ దోషమన్న మరుండుతె

గజాడ హరశర స్త్రీర్థయనుచు। సఖుల రదనేత్ర చరణోల్ల సత్కుచము లు। కోరక చకోర పల్లవ కుధరములను। వెలయు నళి చంద్రికాఘ కోకి ల పయోదములను। గనె, నగె, పల్కె, వేనలిపిదల్చె॥

రాగూడదని యాలోచింపక చక్రవాకపక్షులకు యీహూం బాధపెట్టగా- చంద్రుని చెల్లెలివి నిమిటీ యనుచున్నది- చక్రవాకములు చంద్రుని దలంచుటవలన భయపడుచున్నవని తాత్పర్యం, బాల్యంచేత చొక్కగా ఆగ్రహమెందుకన గాలి బాధింపగా శేషచిహ్నాడా యనుచున్నది- గాలిని శేషుడు తినునని తాత్పర్యం, కుంభమున కెప్పడూ భంగం చేయుట తగునా యనగా చంద్రుడు బాధింపగా చీకటిని బోగొట్టువాడా యనుచున్నది. చీకటిని బోగొట్టినరాత్రి యుండదు గనుక చంద్రుడుండడని తాత్పర్యం. తుదను బాణములు నిలుపుట మంచి గాదనగా మన్మథుడు చంపుటకై రాగా శివుని శిరస్సును గంగచేతను పవిత్రంజేసినవాడా అనుచున్నది. తన చెలికత్తెలెక్కు దన్త- నేత్ర- చరణ- కుచములు జూచి-పూమొగ్గ- చకోరం- పల్లవం- పర్వతం అనుకొనివచ్చిన తుమ్మెదలు- వెన్నెల- కోకిల- మేఘములు రాగా- చూచెను- నవ్వెను- పల్కెను- కొప్పువిప్పెను- తుమ్మెదకు పరాభవముకొరకుకన్నులు జూపినది. నవ్వుటవలన- వెన్నెలకుపరాభవం పల్కుటవలన కోకిలకు పరాభవం- కొప్పు విప్పుటవలన మేఘమునకుపరాభవం అని తాత్పర్యం.

స॥ అంధకప్రియ సూతివై విషపంకసంకలితాంకము వహించు ఖలుడవీవు। యనిశమ్ము నెత్తమ్ములను మారుకొని సత్ప్రధానతల్ జెరుచు నీ మేనమామ। భాసుర నృపపదజా హాంకుచ్ఛదాపకర్షణ కర్కశుండునీ యొసగు సఖుడు। ధరణినెల్లడ ప్రసూత ప్రసవాభిఖ్యను వహించి దిరుగు నీ సహచరుండు। ఔర దర్పక మీరు కృష్ణాలకాప। కార నైరస్యమున ధర్మసూరులగుట। భీమ విజయాహిత గుణానుకామ మహిమ। అవని. మష్టచతుష్టయంబనుటకరుదే॥

ఉదకప్రియుడైన నారాయణునికి ప్రియపుత్రుడవై ఉదకపంకంతోచేరిన పద్మమునువహించిన దుర్మార్గుడవని మన్మథునిపరమైన అర్థం. అంధుడైన ధృతరాష్ట్రుని పుత్రుడవై పాపంతోగూడినవాడవు అని దుర్యోధనపరం' ఎల్లప్పుడు పద్మములబాధించి నక్షత్రప్రాధాన్యం బోగొట్టువాడు నీమేనమామయగు చంద్రుడు. ఎప్పుడు జూదములాడి సత్పురుషప్రాధాన్యము ను జడగొట్టువాడని శకునిపరం. ప్రకాశమానమైన వృక్షస్థానమందుపుట్టిన తెల్లని పండుటా.

రమాయెనోర॥

సంధరము- మేఘం- ముంగురులతో సమానంగాలేక- క- వర్ణంలేక అనగా ధరమయ్యె నన్నమాట. పర్వతంబాయి స్తనములతో సామ్యమునుగోనది. చందనం ఆసాదసరని ము ఖ్యప్రాశస్త్యంలేక మొదటివర్ణంలేక- అనగా దనమై బంగారమై కాంతిసామ్యమును కోరె ను- ప్రదరంబు- బాణం నేత్రసంపదకు భయపడి ప్రక్షిప్తమైన ఆకారంతప్పి- ప్ర- లేక- దర మై- కంఠంతో సామ్యమును బొందగోరెను పవనం- వాయువ నిశ్వాసపద్ధంగాక- అపకారము నుపొంది- పకారంలేనిదై- వనమై యౌవ్వనంయొక్క సామ్యమును గోరెను. తిరిగిపోయి త లక్రిందై- అనగా- ధరము- రధమై- దనము- నదమై- దగము- రదమై- వనము- నవమై- కటి- నాభి- హాస కృతులయొక్క ప్రశస్తిని బొందలేక రధము- మొరపట్టి- నదము గుడివడి- రద ము అనగా దంతము- ఖండితమై- నవముపంకరబొంది మూడింటివర్ణం తొమ్మిదై సాదృశ్యం బునకు దూరమయ్యెను.

గీ॥ ఆననాధరగళమూర్తులతివకజుడు। చంద్ర కురువింద శంఖ చం చలత జేసి। నంమ తచ్చిహ్న కాఠిన్యశిత చలతలు। పొందిరి కచ కుచ హా స దృష్టుల నొనర్చె॥

ముఖం- అధరోష్ఠం- కంఠం- శరీరం బ్రహ్మదేవుడు- చంద్రుడును- కెంపును- శం ఖమును- మెరుపును- చంద్రుడును ముఖమునుజేసిన్ని. కెంపును అధరోష్ఠంచేసిన్ని- శంఖము ను కంఠమునుజేసిన్ని- మెరుపును శరీరంగాచేసిన్ని చిన్నదాన్ని సృష్టించి వాట్లలో నున్న జబ్బులను తీసినాడు- అవియేవనగా- చంద్రుడులోవున్న నయ్యంకమున్ను- కెంపు యొందున్నకాఠిన్యమున్ను- శంఖమందున్న ధావల్యమున్ను- మెరుపుయొందున్న చపలతనున్ను తీసి తిరిగి ఆచిన్నదానియొక్క అవయవములయందే పొనివ్వకుండా సటిరనాడు- అవి యేటి యుందనగా నయ్యంకం కొప్పయందుననున్ను- కాఠిన్యం కుచములయందున్ను- ధావల్యం నవ్వు యందున్ను- చపలతను నేత్రములయందున్న సర్దినాడు.

చ॥ వనద ఝషేంద్ర జంబిర సువర్ణములన్ గిరి నీట నింగి చెట్ల ను సెగ నెకట నీద బహుళవ్యధబొల్పడ మాగ కాగ నార్వను బెళుకం గ కంద నిలరాల కరుంగను నీర్ముగ్రకట మున్న నవయ నొకుటవడ నీరుగ నొనర్చె కచాక్షిముఖ స్తనాంగములూ॥

మేఘం- చేపలు- చంద్రుడు- నిమ్మవళ్లు- బంగారమున్ను యివి ఆచిన్నదానియొక్క కొప్పు

